ఆ. ఇట్టిమిముగుఱించి హీనకార్యం బైన, మాకుఁ బ్రళయము మనుము మగువలార!
భయ మొనర్చెఁ గానఁ బనిచెద నొక్కకా, ర్యమున కరుగవలయు నదియు వినుఁడు.

వ. మహీమండలంబున నయోధ్యాప్రాంతంబునం దనుసాసరయూమధ్యంబున మాంధాతృ మహీనరాగ్రణి యుగ్రతపం బొనరించుచు నున్నవాఁడు. అతనినిష్ఠకు నంతరాయంబు ఘటియించి రండు పొం డని సంభావించి గంధర్వులం గాపుగాఁ జన నియమించి వీడ్కొలిపిన. 58

తే. ప్రమదమునఁ బొంగి పాణిపద్మములు మొగిచి, యేగుదెంచుసుపర్వపర్వేందుముఖుల
విభునికంటె నపూర్వభూవిహరణోత్స, లపుకు పురికొల్పె విజయప్రయాణమునకు. 59

క. సురరమణీజనవిద్యు, త్స్ఫురణావిర్భావమునకు సూచక మగుచుణ్
మొరసెం గత్వావిస్థానిక, మురజధ్వనిగర్జ లఖిలమోహనభంగిన్. 60

తే. స్తనితగతశంఖనుద్ధళధ్వానమునకు, నుబ్బి పురివిచ్చి యాడుమయూరశిశువు
కడప దిగకుండి యానవిఘ్నము ఘటించెఁ, బయనమై వచ్చునొకమరుత్పద్మముఖికి. 61

ఉ. వల్లభుహస్త మూఁది సురవారవిలాసిని యొర్తు వచ్చి శో
భిల్లువిమాన మెక్కి మణిభిత్తిపయిం దననీడ దోఁచుటం
జల్లనఘూర్త మున్నుగ సపత్ని నయించితె యంచుఁ గిన్నవం
బల్లవితాక్షి యై దిగియె భావమునం బరితాప మెక్కఁగన్. 62

క. కొలికిఁ దగుల్పమి నొక్కతె, మొలనూలు పదాబ్జములకు మొరయుచు జాఱణ్
ఘలియింపకు పయనం బిది, వల దనుచుం గాళ్లఁ బెనఁగువైఖరి దోఁపన్. 63

క. ఉర్వీస్థలిపై వేడ్క న,పూర్వవిహారములు సలుపఁ బోయెడుతమి లోఁ
బర్వఁగఁ శకునము దలఁపక, గర్వంబున వెడలి రమరకాంతాజనముల్. 64

తే. అబ్జభవుపట్టి కంతరాయంబు గొలుప, వెడలి రచ్చర లవ్వేళ వేల్పుఁబ్రోలు
ఘనతదీయతపస్సమాకర్షణమున, నైంద్రవిభవాధిదేవత లరుగుమాడ్కి. 65

తే. వాసవునివీటివారవిలాసవతులు, తీవ్రభానునిఁ గదియ నేతెంచి రంత
నతనిఁ గోరఁగోరి యమవసయందుదాఁకఁ, గ్రమ్మి చనుదెంచుబహుచంద్రకళలువోలె. 66

క. సరిక డచి వచ్చునపు డ, చ్చరపిండు వెలింగె మున్ను సంపూర్ణసుధా
కరమండలమును బోలెణ్, ఖరకరబింబమున నేఁడు గలిగెద రనఁగన్. 67

తే. పాసి చనుటకు నోర్వ కచ్చరలు నిలుప, వేఁడి పట్టంగ నిగిడించువిధము దోఁప
భానుకరసంచయము తద్విమానరత్న, కాంతిసంయుక్తిదీర్ఘమై కాన నయ్యె. 68

సీ. బలిదాతృదానసంభవకీర్తిలేఖిక, మురదైత్యభిత్పదాంబుజమధూళి
విధికమండలుపయోనిధిసుధారసధార, జగదండఖండకచ్ఛత్రయష్టి
సనకభేదనశిరోమందారమాలిక, సగరసంజీవనౌషధివతల్లి
కనకాద్రిదండసంకలితకేతనశాటి, హరినభోంతరహారలతిక

గీ. జంభశాసనపురమణిసాలచక్ర, మండలీకృతనిజభోగకుండలీశ
ముచ్యమానవినూత్ననిర్మోకయష్టి, యచ్చరల కంతఁ జూపట్టె నభ్రగంగ. 69

చ. కనకమయాంబుజప్రసవగంధము లానియు బిందుపంక్తిచే
ననయము దొప్పఁదోఁగియును నభ్రసరిత్పవనంబు లప్సరాం
గనలముఖాబ్జసౌరభము ఘర్మజలంబులఁ గ్రోలెఁ గ్రొత్తలై
ఘనతరలాభముం గలుగఁ గైకొనరే ధర నెంతత్రుప్తులున్. 70

తే. కూడి జలదేవతలు మమ్ముఁ గూడవచ్చి, రెంతచక్కనివా రంచు నెపుడు వెలఁగు
దనుక మిన్నేటఁ దమనీడఁ దార చూచి, ముచ్చటలఁ బొంది రప్సరోముగ్ధ లపుడు.

చ. త్రిదశతరంగిణిం గడచి తీవ్రతమై దిగి వచ్చి దేవతా
సుదతులయూర్పుఁదావిచవిచోఁకున వెంటన వచ్చెఁ దేంట్లు త
ద్వదనసనాభివర్గము నవశ్యతఁ బంపఁగఁ బంపు పూని యు
న్నదికమలాధిదేవతల నచ్చిరనెయ్యురు వచ్చిరో యనన్. 72

ఉ. వచ్చువిమానపంక్తులజవంబున జల్లున మున్ను పాయగా
విచ్చినవారివాహములు వెండియు వెంటన రాఁ దొణంగె న
య్యాచ్చరపిండుఁ జూచి తమ రప్పుడు వాయుట నాత్మకీయువి
ద్యుచ్ఛయశంకమై తగిలి తోడనె కుయ్యిడుమాడ్కి మ్రోయుచున్. 73

ఉ. మందసమీరణక్రియల మార్గపరిశ్రమశాంతిగాఁ బయో
బిందువిముక్తి నింపుమదిఁ బెంపుచు నీడలు సేయఁ దోయభృ
ద్బృందమునందు మెల్లనిగతిం జనఁగా నియమించి రప్డు సం
క్రందనవారకామినులు కామగమైనవిమానసంఘమున్. 74

చ. పొదిగొనుమాడ్కిల న్మెఱచి పోనిమెఱుంగులు గా నిగుడ్చుచుం
జెదరనిభూషణప్రభల జిష్ణుధనుశ్శతకోటిఁ బన్నుచుం
ద్రిదశపురీవిలాసినులు దెల్లమిగా జనియింపఁ జేసి రం
బుదముల కెల్ల నట్లోకయపూర్వమనోజ్ఞవిలాససంపదల్. 75

తే. అద్రిశృంగము లనుశంక నధిగమింపఁ, గోరియునుబోలె బలుమాఱు వారిధరము
లాత్మపవనంబుచేత నయ్యమరసతుల, పయ్యదలు దూల్చి కుచములు బయలుపఱిచె.

చ. తపమునఁదుం గుశాసనము దానఫువిత్తు ఫలించుపాదు ని
క్కపుసుఖసిద్ధి గోరి వెదకం దగునాకర మబ్జజాదివి
ష్టపములకెల్ల సంబళ మొసంగెడుపాలెము మర్త్యమంత వే
లుపువెలముచ్చెకంట్లకును లోచనగోచర మయ్యె నవ్వలన్. 77

వ. తదనంతరంబ. 78

సీ. సంభవించె నపూర్వషట్పదగీతులు, లలితమంజీరఝుళంఝుళములు
ప్రాపించె నభినవపరభృతారవములు, కాకలీవ్యాహారకలకలములు
బుగులుకొనె నవీనపుష్పసౌరభములు, గుంభితాస్యామోదఘుమఘుమములు
కలిగెఁ దపోవనికి నుజ్జ్వలపల్లవద్యుతుల్, శయకుశేశయవికాసచకచకలు
తే. భూవరాన్వయతిలకతపోనివాస, మగుట నొదవినభాగ్యోదయమునఁ బోలె
నపుడు సరయూనదీతీరవిపినమునకు, నమరపురవారలలనాసమాగమమున. 79

వ. ఇట్లు తపోవనప్రాంతంబున విడిది గా విడిసి. 80

## మాంధాతృతపోవనంబున రంభాదులు శృంగారక్రీడ లొనర్చుట.

మ. కర మాశ్చర్యము గాఁగ నచ్చరలు శృంగారోజ్జ్వలాకారలై
సరసక్రీడలఁ జొచ్చి రానృపతిపస్సంస్థాన ముచ్చైచ్చరట
చ్చరణాంభోరుహనూపురస్వనల నాశ్చర్యానుమోదంబులై
హరిణీసంఘము దర్భగర్భితముఖవ్యావృత్తి నాలింపఁగన్. 81

సీ. పరిమళం బంటక పసువంపుమొగ్గల, కెలయించుతను గాలిపొలపమునకుఁ
దనలోని జాతివైరము డించి దూర్వముల్, మెట్టనిమృగజాతి మెలఁకువలకుఁ
బక్వసార్వర్తుకఫలపుష్పములు గల్గు, తరువులనీడలు దరలమికిని
బగలు రే మొగుడనితొగలఁ దమ్ములఁ గ్రాలు, కొలఁకులు గడ లెత్తి కలఁగమికిని
తే. వెలుఁగు దనుకంగ నిజతపోవిభవ మాత్మ, మెచ్చి పొగడుచుఁ జనుదెంచునచ్చరలకుఁ
జిత్తవీథుల జనియింపఁ జేసె శంక, నపుడు గనుపట్టె యౌవనాశ్వనృపతిపట్టి. 82

ఉ. దంతుల సంతతాయ పనుదీఁకటి పైకొననీక తేజ మా
క్రాంతదిగంత మై వెలయ గాఢపు సోఁకనిదీపమట్లు వి
శ్రాంతిసమాధిసంగతి నచంచలుఁ డైనతపస్వియందుఁ ద
త్కాంతలయత్నముల్ విఫలకార్యము లై విలసించె నయ్యెడన్. 83

చ. ఒకయువ గత్తి జంగ యిడ నూరురుమల్ తలచూపఁ దీవ యం
దుకొని నిగుడ్చుటు స్వీకచదోర్లతమూలము చూడ్కిచూఱగా
నకనక నాను పాఁగి వలినాభి బయల్పడ నీవి జాఱి మీఁ
దికి మొగ మెత్తి యొక్క సుదతీమణి చేరువఁ గోసెఁ గ్రొవ్విరుల్. 84

చ. పదముల సంపునక్ బయలు పల్లవితంబుగ రాకపోకలన్
వదనము తీవఁ జందురుని సైఖరి చూపఁగ దూఁగఁదూఁగఁ బ
య్యెద పలుమాఱు గాలి సెగయం జనుగుబ్బలు తొంగిచూడఁగాఁ
బ్రదళవధూటి వేడ్కొ తె తీవల నుయ్యల లూఁగె వేడుకన్. 85

చ. కొలఁదిగ నీడ్చి యీడ్చి కొనగోళ్ళ మెఱుంగు దుఱంగలింపఁ గా
వలపల దాపల న్నిగిడి వాలికచూపులు తీఁగె సాఁగ ను
బ్బలయిరుగ్రేవల న్నఖరపంక్తి బయల్పడఁ జేతు లార్చుచున్
వెలఁది యొకర్తె కట్టెనుర వేనలి చిక్కెడలించె సోలుచున్. 86

ఉ. పట్టినహస్తకాంతి మును పల్లవితం బగువీణె పాటచేఁ
బుట్టుచిగుళ్ల రెట్టి యగుపొల్పు వహింప మొగంబుతావికిం
జుట్టినతేంట్లకున్ శ్రుతులు చూప సుధారసధార పోలికం
బట్టి మృదుస్వరం బెసఁగఁ బాడె నొకర్తు మనోజ్ఞభంగులన్. 87

క. ఈరీతి వివిధమధురా, కారంబులఁ దమవిలాసగరిమలు నెఱపన్
మేరుగిరిలీల మలయుచు, మీరణగతులను బోలె మెదలక యున్నన్. 88

సీ. కుసుమపల్లవభాసికుంజపుంజంబులు, రత్నచిత్రితమందిరంబు లయ్యె
నుత్తాలధరణీరుహోత్కరస్థలములు, నవమణిస్తంభమండపము లయ్యెఁ
బావనస్నానార్థబహుపల్వలంబులు, కృతకకేళీసరోవితతు లయ్యె
విహరమాణానేకవిధశకుంతంబులు, తరుణపారావతద్వయము లయ్యెఁ
తే. దీవ్రనియమానుకూలప్రదేశ మైన, యర్కకులమౌళి నివసించునాశ్రమంబు
హారిరతిఖేలనోచితహర్మ్య మయ్యె, మఘునదిందీవరాక్షులమాయవలన. 89

వ. అనంతరంబ సమయసముచితసన్మార్గధూపలేపస్రగ్బలిప్రకరవర్ణనోపశోభితం బై తపస్వి రంగంబు విలాసినీలాస్యరంగం బగుచు లోకవిలోచనోత్సవంబు నాపాదింప నను రూపరూపానవద్యవాద్యధ్వనులతోడ నవినూత్నవిచిత్రయవనికాభోగంబు నభోభా గంబు నలంకరించె. నృత్తవిద్యాచాతుర్యధుర్యుం డగునాచార్యుండు కట్టెదుర మధు రగంభీరస్ఫుటాక్షరంబు గాఁ బుష్పాంజలిక్షేపణంబుతోఁ బ్రస్తుతోచితసంపల్లాస్య ప్రస్తావంబు చూపి యవనికాపనయపూర్వకంబుగా షోడశాష్టచతుర్ద్వ్యాద్యేక క్రమసంఖ్యాకంబు లగుమృదంగకాహళకాంస్యతాళహుడుక్కాకరడావాద్యవిశే షంబులయందు నేకైకమేళాపరవాదనోపరిపరిస్ఫురితంబుల గుఱిగనణీలాగుమోడి బంధవతికుండల్యాదివాదనభేదంబుల వివిధమధురగంభీరఘోషంబు లఖిలచేతనశ్రవ ణేంద్రియమోహకంబు లయ్యె. ఉపరతమురజకరడాహుడుక్కాదినాదంబులు నతిచతురవాంశికోపదీయమానతానోపగీయమానవీణాదిపేశలకలక్వాణప్రాణాయ మానంబులం బ్రోజ్జ్వలాలప్తిపూర్వకంబులు నై కాకువాదిదోషరహితకలకంఠీకంఠ గీయమానగేయంబు లనుపమేయంబు లై నిఖిలచేతనాచేతనస్రావకంబు లయ్యె. మల యపవనచపలశిలీముఖముఖరస్థలనలినీకులవిలాసాపహాసకంబు లయి యనునూపాధిక నూపురఝుళంఝుళశింజితమంజులంబులు గావించి విచిత్రరతిప్రనృత్తంబు లగు నేప

ధ్యాంతరితపాత్రంబులఁ గించిల్లక్ష్యమాణపదపల్లవాంచలంబులు దిదృక్షుజనహృదయో న్మాదకంబు లయ్యె. గవునెన దివిసినం గనుపట్టువిచిత్రచిత్రరూపంబులరూపంబున యవనికాభోగంబు ఘటయింప నిశ్శబ్దభూషణంబును నిర్వ్యాకృతినియతసకలాంగకంబు నగునిజస్థైర్యంబు నిర్భరం బై పైవాతి సారవశ్యచ్ఛలంబున పశ్యజ్జనంబులపయిం బపం బిరగొను ప్రనాళిపండికాన్వయియామండితపుష్పాంజలివిలసిత లగున ర్తకీపరంపర లఖిలచేతస్సేతోవలోకనగ్రాహంబు లై యావిర్భవించె. ద్రష్టృజనకౌతుకావేశోద యసమర్థితకస్వాదిఘూర్ణోపమానపునర్వికల్పితాతిసూక్ష్మయవనికావ్యపాయంబున లఘు సంఘూర్ణాన్వృతి వొఱంగి మెఱుం గెక్కుశారదనక్షత్రంబులచందంబున నిర్నిమేషనిరీక్షణ పాత్రంబు లై పాత్రంబు లను నేపథ్యస్ఫురితంబులు సమపాదస్థానకస్థితంబులుం గీతానుగుణాకంపితశిరస్కంబులు నగుచు విలాసగతిం బుష్పాంజలిక్షేపణం బొనరించి నిఖిలాలోకవిలోకనోత్సాహంబు లై నవసందలాస్యంబులకు నుపక్రమించి రప్పుడు శిరో నక్షకరిపార్శ్వకటిపదాభిధానంబుల నేత్రభ్రూనాసాహనుకపోలాధరనామధేయం బులం గ్రీవాబాహుతుండోరుజానుజంఘానామంబులం గల్గుసంగోపాంగప్రత్యంగం బుల తాళలయానుకరణవిశిష్టచేష్టావిశేషంబులయందుఁ బ్రత్యేకంబ యథోక్తంబు లగు త్రయోదశవిధశిరఃప్రయోగంబులు పంచప్రకారవక్షోవిలసనంబులు చతుష్షష్టి భేదప్రశస్తహస్తాభినయంబులు నంగుళిక్రమవర్తనోపచితచతుర్విధహస్తాభినయాంత రంబులుం బంచపార్శ్వవిధిగ్రాహంబులుం బంచవిధకటినటనంబులు నవసంఖ్యాకరచరణ విన్యాసంబులుం జతుర్భంగికచరణవిన్యాసాంతరంబులునుం బంచప్రకారవక్షోవిలస నంబులును షట్త్రింశద్దృష్టివిశేషంబులు నుపాంగభేదోక్తచతుర్విధముఖరాగయోగం బులు షడ్భాబహుస్ఫురణంబులుఁ బంచప్రకారోరుసంచలనంబులును సప్తవిధజాను విలాసంబులును బంచవిధజంఘాప్రవర్తనంబులును వెండియు దండలాసకాంగోక్తకం బులను త్రింశత్స్థానకంబులు త్రింశచ్చారిభేదంబులు భ్రమరిసప్తకంబునుం గరణవింశ తియు నంగహారవిశేషంబును మఱియును ముఖసముఖసౌష్ఠవలలితభావకౌతుక్యనుమాన ప్రమాణస్థానకారణానుకరణాంగాసంగడాలఢిల్లాయీసనణికిత్తుతరహారోల్లాస వేవతన నిలయమపయమకాటనసంధస్థాపపరీక్ష-నామంబులం గలుగులాస్యాంగచతుర్వింశతివిశే షంబులు నాడఁగాఁ గలుగునసంఖ్యేయాభినవాభినయంబులు యథాలక్షణంబులు యథాక్రమములు యథాదర్శనంబులుం గా నృత్యప్రవర్తనంబున నభినయించుచుఁ బాత్రగుణాన్యక్తిప్రయుక్తంబులు శిల్పనైచిత్రీసమాలోచనసూచకంబులుం బరస్పర సాన్యలక్ష్మీప్రసన్నంబులు బహుహాత్రోపయోగప్రయోజనంబులుం గ్రియామాత్స ర్యమాధురీధురీణంబులును సభ్యనేత్రచమత్కారకారకంబులు నై ఘనఖిపమభేదద్విధా కారంబు లగువివిధవిచిత్రబంధప్రచారంబుల విలసింపం జొచ్చి రంత నూర్వశియుం దిలోత్తమయు మేనకయును సహజన్యయుం బ్రమ్లోచయు ననుమ్లోచయుఁ బుంజికస్థ

లయును గృతస్థలయును విశ్వాచియు ఘృతాచియు మనోరమయు రంభయుఁ దిలోత్తమయుఁ జంద్రరేఖయుం బంచచూడయు మిశ్రితయు మిశ్రకేశియు మొదలుగాఁ గలిగినచతుర్దశవంశావతీర్ణంబులు షోడశకోటిసంఖ్యాకంబులు తుల్యరూపవయోవిభ్రమంబు లై చరింపఁ బ్రపంచమనోవంచకంబు లగుదివ్యాప్సరోజనంబులు శంబరారికిం దోడుచూపుచుఁ దదీయమూలబలంబు చందంబునం బర్జన్యునకుఁ దోడుచూపుశంపాపరంపలవిధంబున వసంతునకు నెన్నిక యిచ్చుపుష్పలతికలవిలసనంబునం గ్రమంబున జతురష్టషోడశద్వాత్రింశచ్చతుష్షష్ట్యాద్యుత్తరోత్తరగణనావృద్ధివిశేషంబులం బంక్తిబంధబంధురగతి నద్భుతాద్భుతంబుగా నావిర్భవించుచు దండయుగ్మంబుల నంజలిపుటంబులు ఘటియించుచుఁ బరస్పరసామ్ముఖ్యంబునం బొలుచుచు నితరేతరస్థితస్థలవినిమయంబు చూపుచు నిరంతరనూపురఝుళంఝుళశింజితమంజులంబుగా సవ్యాపసవ్యపార్శ్వంబులం గ్రమప్రసృతపార్ష్ణిప్రచారంబులు గొలుపుచు వాద్యతాళయతిమానంబు లాకర్ణించుచుఁ దదనుగతంబుగా నర్తనౌత్సుక్యజచిత్తవికారానుకారం బగుశరీరపారవశ్యంబు నెఱపుచు నానులవర్తనంబులం బ్రవర్తించుచు మండలప్రచారంబుల సంచరించుచు వాద్యానుకృతంబులు గానందతాళంబు లిచ్చుచు నాభిముఖ్యపరావృత్తముఖంబుల దండతాడనంబులు గావించుచు వాద్యతాళానుకూలంబుగా నితరేతరదండానువిద్ధస్థానకంబులు సంఘటించుచు హస్తచలనవలనవర్తకీవర్తనంబుల నర్తించుచు లయత్రయసమన్వితంబుగా వివిధబంధబంధురప్రచారంబుల విహరించుచుం గేవలయతిమానంబున నృత్తబంధప్రవర్తనంబుల వినసించుచు నృత్తప్రయోగబంధప్రయోగంబులు రంటియందు నాదిమధ్యనిర్వాహంబులం గ్రమంబున మృదుమధ్యద్రుతగతిభ్రమరీవిశేషంబులం బరిగ్రహించుచుఁ బ్రతిగతిసమాపనంబున నతికోమలంబుగా స్థానకోపక్రమంబు నెఱపుచు నుపక్రాంతభావంబుల రసోత్తరంబుగాఁ గళాసించుచుఁ బ్రస్తుతైకమార్గంబు నంబందయమందరసోదయవశంబున నూత్ననూత్నంబుగా ననుక్తవిచిత్రాంతరమార్గాంతరంబులం బ్రపంచించుచు ఋజుచతుష్కచక్రాకారగతిత్రయీప్రారబ్ధంబులు పరస్పరవ్యతిలంఘనమార్గరూపంబులు నై సారిచంద్రకళాబంధుసారమురడిహంస లీలావిఘాంగాభరణనారాయణవల్లభ చతుర్ముఖరంగలక్ష్మీరంగమనోహరాదివివిధమధురానేకబంధప్రచారంబుల నటియింపం జొచ్చిరి. ఇవ్విధంబున సౌందర్యంబులకు సాఫల్యంబును దారుణ్యంబులకుఁ గృతార్థతయు లావణ్యంబులకు నుత్తేజనంబును విభ్రమంబులకు నుపాదానంబును నేపథ్యంబులకు విషయంబును నై నర్తకీవిలోకనజనితం బైనశృంగారంబును దదీయవివిధాపూర్వనృత్తబంధవిషయం బైనయాశ్చర్యంబును దదన్యలాసికాంతరవిషయం బైనహాస్యంబును దదితరవిషయం బైనబీభత్సంబును దదీయపయోధరభరభుగ్నావలగ్నశంకితభంగివిషయం బైనభయానకంబును రసాతిరేకసద్యస్స్విన్నహస్త

ననుపుఁబల్లవులకు నర్ఘ్యోపచారముల్, సేయు సేవ నూఁదుచిగురుఁబోండ్లు
చిత్ర మైనతపసిశిష్యు లై పరిచర్య, చూపు చుండి రాత్మశుద్ధి గలిగి. 95
క. చిరకాల మిట్లు వారిం, బరిచర్యలు గొని తపస్వి పర్వానకృపమై
మరలం బనిచిన నంతయుఁ, బురందరుం డెఱిఁగి యాత్మఁ బొడమినభీతిన్. 96

## ఇంద్రుఁడు మాంధాతపై మేఘములనంప బృహస్పతితో నాలోచించుట.

తే. దిగధిపాలుర నెల్లఁ దోడ్తేరఁ బనిచి, వారు దాను రహస్యవిచారపరత
నుండి వెఱతోడి భయమున నుదిలకొనుచుఁ, బలికె గీష్పతిఁ జూచి యాబలవిభేది. 97
చ. నరసురదైత్యజాతిజు లొనర్చరె మున్ను దపంబు ధాత్రిపై?
మరునకు లోను గానిధృతిమంతుఁడు గల్గినఁ గల్గుఁ గాక! శం
బరరిపుబంటుగాఁ గొనుతపస్వియుఁ గల్గునె? చూచునంత న
చ్చర లఁట శిష్యు లైరి పెఱసంయమియుం గలఁడే యి టెన్నఁగన్. 98
ఉ. ఖండసుధాకరాలికలు గాఢవిరక్తిఁ దపస్విశిష్యు లై
యుండిరి పూఁపు దప్పుటకు నుల్లము రోసి రతీశుఁ డిక్షుకో
దండముఁ బుష్పబాణములదండముఁ బాఱఁగ వైచి చేతులం
దండమునుం గమండలువుఁ దాలిచి మస్కరి గాక యుండునే? 99
తే. కార్య మెయ్యది మనకు నక్కడిఁదితపసి, కంతరాయంబు పుట్టెడునంత గాఁగ
వర్ష మొదవింపఁ బుష్కలావర్తకములఁ బంపుద మె? యన్న విని నవ్వి పలికెగురుఁడు.

## బృహస్పతి యింద్రునకు మాంధాత వశ్యుఁడు గాఁడని చెప్పుట.

ఉ. కా దమరేశ! కార్య మది కన్గొన బ్రహ్మను నైన మన్మథో
న్మాదము గొల్పనచ్చరలమానస మింతటిలో విరక్తికిం
బాదుగఁ జూడ నేర్చినతపస్విశిఖామణి మింటఁ బన్నినం
భోదకులోదయంబు నలపోకయ నుప్పున బాఱ నూఁదఁడే. 101
ఉ. అద్రులు మీఁదఁ బడ్డ భర పాటఁ దలంపరు శూలహస్తు యై
భద్ర యదల్చి పైకొనిన భ్రాంతి సహింపరు మేర దప్పి సా
ముద్రతరంగముల్ దిశలు ముంచినఁ జింతిల రన్న వారిదో
పద్రవవృత్తికిం గలఁగఁ బొలుదురే హరిభక్తినిశ్చలుల్?. 102
సీ. దూషింప నొల్లరు దుష్టాత్మకుల నైనఁ, బ్రతి సేయ నొల్లరు పగతు నైన
నభిలషింపఁగ నొల్ల రాత్మదేహం బైన, వగవంగ నొల్లరు వగిలి యైనఁ
బట్టంగ నొల్లరు ప్రాణసంకట మైన, నాడింపకొన నొల్ల రలసి యైన
వాదింప నొల్లరు వశ మైనపని నైన, వాఱుపెట్ట నొల్లరు మర్మ మైన

చ. కరుణయ కాక నన్ను నరికట్టఁగ నీ వొకలక్ష్య మెట్టు? లం
బర మఖిలంబు మ్రింగి యసుఁడుపట్టుకలఁ గ్రాసెదఁ జూడు మన్నయా
ప్పురుసున నిప్పయోంబునిధి పల్మఱుఁ జెల్లెలికట్టమీఁదఁ బె
ల్లురుదుగఁ బ్రోవుకొల్పెడు మహోమలకోపమహాక్తి కావలిన్. 112

చ. వెడఁదలు గాఁగవించుచుఁ బ్రవేశతటంబుల నొగ్గి క్రోలి నో
ళ్లడవఁగ వీఁపుచిప్ప లెగయుం బడి పింజలు వాఱ మింటిపై
వెడలునదీప్రవాహములనెంటనె వెల్వడఁ గాంచు నిమ్మహా
జడనిధిలోనిశాబకఝషంబులు మ్రింగినగర్భశైలముల్. 113

ఉ. హేల దలిర్ప మి న్నొరసి హెచ్చుమహోర్మిహారివిజృంభణా
భీలతఁ జూచి ముంచు నని బెగ్గిలి వెల్వడి పోవుబాడబ
జ్వాలల కిప్పయోంబుధి యొసంగుకృపాభయహస్తపఙ్క్తులం
బోలెడుఁ దీరవిద్రుమసమూహశిరఃపతదూర్మిమాలికల్. 114

చ. ఎడపక యిచ్చుదాతలకు నివ్వలఁ గల్గుచు నుండు నిక్కమి
క్కడలిపయఃప్రపూరము లగణ్యము లైనఘనాఘనంబు లె
ప్పుడుఁ దనియంగఁ గ్రోలికొని పోయి నిరంతరవృష్టి చూపుటం
బొడమినయేఱు లీయుదధిపుంగవుచెంతె గమించి కూడెడున్. 115

తే. విశ్వవిశ్వంభరకు హారవిలసనంబు, దోఁపఁ జేయును నున్నది దుగ్ధవార్ధి
యున్నవాఁ డిందు నిందీవరోజ్జ్వలుండు, నాయకస్ఫూర్తి నాదినారాయణుండు. 116

వ. అని యనేకభంగులం గొనియాడుచుం జని యప్పయఃపయోనిధానంబునకు నంతరం
గంబునుంబోని శ్వేతద్వీపంబు లోచనగోచరం బగుటయుఁ బ్రహృష్టతాంతఃకరణు
లగుచుం గరకమలంబులు మొగిచి నభోపతనంబు బొనరించి బహుసహస్రయోజన
విశాలరమణీయం బైనయమ్మహాద్వీపంబునం జూపట్టువివిధవిశేషంబు లొండొరులకుం
జూపి చెప్పికొనుచుం గనువారు ముందట. 117

## శ్రీవైకుంఠవర్ణనము.

మ. నముచిద్వేషిముఖామరు ల్గనిరి నందానుస్వభూనీలకం
ఠము నభ్రంకషసాలచక్రనవరత్నశ్రీకృతాశావకం
ఠము దౌవారికరుద్ధసిద్ధమునిపూర్ణస్వాపకంఠంబు నా
త్మమనఃకల్పితనిష్ఫలాద్భుతభయోత్కంఠంబు వైకుంఠమున్. 118

క. కని యంతంతట వినయా, వనతశిరస్కు లయి చేరవచ్చి దిశాపా
లనజనితాహంకృతి విడి, వనజోదరపారతంత్ర్యవశగాత్మకు లై. 119

సీ. చక్రభూధరశిలస్థావములకైఁపునఁ, గనుపట్టుసాలచక్రములపొడవు
నూర్ధ్వాండఖండమునుండు స్తంభము లయి, పెంజిల్లుబహుగోపురములమునుపు

నై కటికంబును మహేంద్రలోకములోని, రమ్యహర్మ్యపరంపరల బెడంగు
నింగి యుంతిసి తెల్పి నిజకింకిణీధ్వనిఁ, జాలెడు కేతనచ్ఛటలసొబగుఁ

గీ. బురరమాధృతిఘనసారభూష లనఁగ, నమరునుపకంఠమణితోరణములచెలువుఁ
జూడ్కి కగిమి నల్లములతోఁ జుట్టి తివియ, నాననము లెత్తి కనుఁగొంచు నరిగి మఱియు.

సీ. ప్రసవరసంబాని పద్మినీస్థలములఁ, బ్రణవ మావర్తించుబంభరముల
నుగురోపవనముల మంత్రరాజము గోల్పు, శారికాశుకపికశాబకములఁ
దాపత్రయంబు డిందఁగఁ జిదానందశైత్యము వెదచల్లుమందానిలముల
సాలోక్యసామీప్యసారూప్యసాయుజ్య, భంగుల విలసించుభాగవతుల

గీ. సంస్తుతించుచు మెచ్చుచు సంతసిలుచుఁ, గాంచి మ్రొక్కుచు రాజమార్గమున నేగి
ఖచరకులముఖ్యు లల్లంత గాంచి యెదుట, మధుమహాసురవిధ్వంసిమందిరంబు. 121

వ. కాంచి కదియ నేతెంచి భయాద్భుతావహమస్తకవక్షస్థ్సలబాహుచరణాభిరామమూర్తులును కరాళదంష్ట్రాంకితరాళాస్యులు వివిధాయుధహస్తులు విచిత్రభూషణాంబరగంధమాల్యాభిశోభితులు ననుపమానజ్ఞానశక్త్యాదిగుణసంపన్నులు నప్రతిమాష్టవిధైశ్వర్యధుర్యులు నయుతలక్షకోటిశతకోట్యాదివర్గంబులు నసంఖ్యేయములు నగు విష్ణుకింకరులును, పూర్వద్వారంబునఁ జండప్రచండాదులును, దక్షిణద్వారంబున భద్రసుభద్రాఖ్యులును గుముదకుముదాక్షముఖ్యులును, పశ్చిమద్వారంబున జయవిజయప్రముఖులును, ఉత్తరద్వారంబున ధాతృవిధాతృప్రభృతులును రక్షింప, మఱియుం జతుర్భుజులును శంఖచక్రధరులునుఁ బీతాంబరపరికల్పితులునుం గాలమేఘసంకాశమనోజ్ఞశరీరులును గణసహస్రపరివృతులు నగు వైకుంఠవైమానికు లనేకులు పరితఃపరిరక్షకులునుం గా, హరహిరణ్యగర్భసనకాదివందనీయంబును తదీయవాఙ్మానసాగోచరామేయప్రభావైశ్వర్యస్వాభావికంబును సేవాగతపాలితాశేషసురాసురసిద్ధయోగిపరంపరాసంకులప్రాంగణంబును నగు నమ్మహామందిరంబునం బ్రాంజలు లగుచు నిలిచి, అవసరం బెఱింగి లోపలికి విజ్ఞాపనంబు చేసి పనిచినపిదప నాహూతులై పురుహూతముఖ్యులు హర్షోత్కర్షంబునం బ్రవేశించి, అంతరాంతరదివ్యావరణశతసహస్రంబులు దివ్యోద్యానశతసహస్రంబులుం గడచి నడచి, అనంతరం బాయనంతవిశాలరమణీయం బైన యంతర్దివ్యాయతనాంతరంబు దఱిసి చని, అందుఁ గ్రీడాశైలశతసహస్రోపశోభితంబులుం గోకిలశారికామయూరకీరాదిశకుంతకులకోలాహలకలకూజితసమాకులంబులుం బరితఃపరిలసమానపాదపస్థనానాగంధవర్ణదివ్యప్రసవసమగ్రంబులుం, క్వచిత్క్వచిదంతస్థపుష్కరత్నాదినిర్మితదివ్యలీలామంటపశతసహస్రాలంకృతంబు నగు పారిజాతాదిదివ్యకల్పకారామశతసహస్రంబుల నేత్రను, శ్రీమత్ప్రవాళకృతసోపానపరంపరావిరాజితంబులు దివ్యామలామృత

రసోదకపూరపూరితంబులు నతిరమణీయదర్శనరాజహంసాదిదివ్యాండజకులాతిమనోహరమధురస్వరవాచాలంబులు సంతతస్థముక్తామయదివ్యక్రీడాస్థానోపశోభితంబులు నగు దివ్యసౌగంధికదీర్ఘికాశతసహస్రంబులచేతను, మఱియునుం బ్రవిష్టజనంబులకు నిరస్తాతిశయానందైకరసానంత్యంబున సకలకరణసముస్మాదంబులు ననవరతానుభూయమానంబు లయ్యు నభూతపూర్వంబులచందంబున నవనవాశ్చర్యావహంబులు నై నారాయణదివ్యలీలాసాధారణంబులుం బద్మవనాలయాదివ్యలీలాసాధారణంబులును నగు వివిధమధురక్రీడాదేశశతసహస్రంబులచేతను పరివృతంబై, దివ్యరత్నమయంబును దివ్యరత్నస్తంభశతసహస్రశోభితంబును దివ్యనానారత్నకృతస్థలీవిచిత్రంబును దివ్యాలంకారాలంకృతంబును బ్రత్యప్రదేశకృతదివ్యపుష్పపర్యంకవిలసితంబును నిత్యవికచనానాప్రసవాసవవాసనాస్వాదమత్తభృంగావళిసముద్గీయమాన దివ్యగాంధర్వపూరితంబును జందనాగరుకర్పూరదివ్యపుష్పావగాహితమందానిలాసేవ్యమానంబు నగుదివ్యస్థానమండపంబునందు మధ్యప్రదేశంబున, విశ్వప్రపంచసామ్రాజ్యభారకుం డగువిష్వక్సేనుండును, వెండియు స్వభావనిరస్తసమస్తసాంసారికస్వభావులును భగవత్పరిచర్యైకభోగపరాయణులు నసంఖ్యేయులు నగువైనతేయాదినిత్యసిద్ధపరిజనంబులును, యథాయోగ్యంబుగం బరివేష్టించి సేవింప, గుణశీలరూపవిలాససాదృశ్యానురూపలక్ష్మీసమేతంబుగాఁ బుష్పసంచయవిచిత్రితమహాదివ్యయోగపర్యంకంబుపై ననంతభోగిభోగాసనంబున. 122

## శ్రీమన్నారాయణదివ్యమంగళవిగ్రహవర్ణనము.

సీ. ఆత్మప్రదానాహమహమికావయనంబు, సౌందర్యసర్వస్వశంసనంబు
వశదిశాముఖగంధితారుణ్యకౌమార, మఖిలలోకైకస్వయంసుఖంబు
పశ్యజ్జనేక్షణప్రవణామృతౌఘంబు, నైజదోరంతరాంతస్పృహంబు
సిద్ధయోగివ్రాతచేతఃప్రపశ్యంబు, వందారుదోషసర్వంసహంబు
తే. కరతలోచ్చయఫలసక్రకల్పకంబు, సర్వతోముఖసౌహార్దసంప్లవంబు
నగువిచిత్రమహామహం బౌపనిషద, మనురలోచనగోచరం బయ్యె నపుడు. 123

తే. ఆదిపూరుషప్రత్యవయవములందు, వితతలావణ్యమగ్నమై వదలలేని
ఖచరతతిచూడ్కి నితరాంగకములు దార, ప్రవణగుణములచేఁ జుట్టి తగిచిరో నియ.

మ. సరసాంభోదము గాఁ దలంతురు రమాసౌదామినీరేఖచే
వరనీలాగము గాఁ దలంతురు మహావక్షస్తటీశోభచేఁ
బరమాంభోనిధి గాఁ దలంతురు చలచ్చాపహారార్మిసంఘంబుచేఁ
బురుహూతప్రముఖామరాధిపతు లంభోజాక్షు వీక్షించుచున్. 125

చ. హరుఁడు శిరంబుపై నిడి సమాదరణంబు ఘటించినప్పుడుం
బొరసినకందు కార్శ్యమును బోదాకొ చంద్రుఁడ! కీమురారిప
చ్చరణము లాశ్రయించు నఖచంద్రులు పూర్ణులు నిష్కళంకులున్
హరిసరియాశ్రయంబు గలదా యని దివ్యులు మెచ్చి రాత్మలన్. 160

వ. ఇవ్విధంబున నఖిలచేతనచేతోవలోకనలోభనీయసర్వాంగసుందరుండును, నిత్యానిరవద్యనిసర్గదివ్యాద్భుతాచింత్యాశ్చర్యలావణ్యమాధుర్యగాంభీర్యస్థైర్యధైర్యాద్యనంతకల్యాణగుణరత్నరత్నాకరుండును, ఆత్మానురూపసుకుమారసురభిసుగంధబంధురదివ్యభూషణభూషితుండును, దివ్యమూర్తినదేపాంచజన్యసుదర్శనకౌమోదకీనందకశార్ఙ్గాదిదివ్యాయుధసేవ్యమానుండును నై, నిజోత్సంగసంగతమాసమాహితాత్మపరస్పరనిరీక్షణమధురసార్ద్రప్రణయనవ్యతరదివ్యరసానుభవంబుగాఁ గాలంబు నంతిన్నవింపం జేయుచు, మధురగంభీరభావసర్భితమందహాసవిలాసవికాసితవదనారవిందశోభానుభావభావితం బగుచు నిగుడు నిజదివ్యామలకోమలావలోకనలీలాలసవాగమృతస్యందంబున నఖిలజనహృదయాంతరంబులు నాపూరితంబులు గావింప, సకలకార్యకారణైకకారణు నశేషచిదచిదంతరాత్ము పరమాత్ము నఖిలేశ్వరేశ్వరు ననీశ్వరు నఖిలైకసాక్షి నఖిలవాఙ్మనసాగోచరానేకప్రభావు నిఖిలహేయప్రత్యనీకసంగల్యాణగుణైకతానస్వరూపుం బురాణపురుషుం బురుషోత్తముం బుండరీకాక్షు సమస్తచేతనైకాభిగమ్యు సర్వప్రకారైకనిరతిశయభోగ్యు నాశ్రితవత్సలు నాపత్సఖు ననాథనాథుం గృపాలీలాపరాయణు శ్రీమన్నారాయణుం గాంచి, మహేంద్రాదిబృందారకులు పాదచూడంబు నాచూడపాదంబునుం గాఁ దదఖిలావయవంబుల నెల్ల వివియుపమానసౌందర్యసముత్తేజసద్యోతలావణ్యామృతరసపూరంబు నాత్మీయనిశ్చలదృష్టినాళంబుల వెక్కసంబుగం గ్రోలుచు నిస్తరనుస్తాంతస్తాపులు నిస్సీమపరమానందజలధినిమజ్జమానాంతరంగులుం బ్రకృష్టసంతోషబాష్పధారాప్రాలంబమండితోరస్కులుం బ్రహృష్టరోమాంచకంచుకితసర్వాంగులు నగుచు నత్యంతసాధ్వసవినయావనతసర్వాంగంబులతోఁ దదీయదివ్యపదపీఠోపాంతప్రదేశంబుల నంతంతం బునఃపునస్సాష్టాంగదండప్రణామంబు లాచరించి లేచి ఫాలకలితాంజలిబంధంబులతో గద్గదకంఠంబులతో నిట్లని వినుతించిరి. 161

## దేవేంద్రాదులు శ్రీమన్నారాయణుని స్తుతించుట.

భుజంగప్రయాతము.

నమస్తే సమస్తైకనంతవ్యమూర్తే, నమస్తే సమస్తస్వనాద్యంతకీర్తే
నమస్తే ప్రశస్తోల్బణజ్ఞానమూర్తే, నమస్తే నిరస్తాంఘ్రిసంప్రాఖిలార్తే: 162

వ. అని వెండియు. 163

క. నేమమున నఖిలచిదచి, త్స్తోమంబున కాత్మ వగచుఁ దోఁపించుటచే
నేమై పరులై సర్వము, వై మెరసెద వీ వొకండ వంబుజనాభా! 164

క. కారణముకంటెఁ గార్యము, వేఱై కలుగమికిఁ గాదె వేదాంతంబుల్
నారాయణ యీవిశ్వము, కారణ మగుని న్నొకండ కా వచియింమన్. 165

క. దిక్కగఁ బుట్టెద ననునీ, యొక్కమనోరథము మొదల నొగిఁ దెలిపి కదా!
యొక్కటి దెలిసినఁ దెలియుం, దక్కటిసర్వంబునను బ్రధానపుఁబలుకుల్. 166

క. దేవతల వీని మూఁటిని, జీవుఁడ నగునేన చొచ్చి చేసెద రూపా
ఖ్యావివరణ మనునీతొలు, భావము గనఁబడిన నినుఁ బ్రపంచము దెలియున్. 167

క. ఆరూఢవేదశిఖలం, దా నై బ్రహ్మాత్మసత్పదప్రముఖంబుల్
కారణము దెలుపఁ జాలక, నారాయణ! నీవిశేషనామము గోరున్. 168

తే. ఈశభవదాత్మకతచేత నెల్లజగము, నొకఁడ యని కాదె భవదాత్మకముగఁ గంట
కించనుల 'నేహ నానాస్తి కించ' నాది, వాక్యములు విశ్వవైవిధ్యవారకములు. 169

క. పరమును నపరంబును మఱి, పర మై యపరంబు దెలుపఁ బడుననుశంకన్
బరమేశ! నీవు నధికము, సరియును లే దని విశేషశాస్త్రము దెలుపున్. 170

చ. తివుటఁ బయోధు లేడు గణుతించినచోటఁ దదూర్మి ఫేనబిం
దువులు సమంబు గానిగతి తోయరుహేక్షణ విశ్వ మింతయున్
భవదయుతాయుతాంశశతభాగకళాస్థిత మెట్లు నీసమం
బవు నని కాదె నీవ నిగమాగ్రము లెన్నెడు నద్వితయతన్.

క. చేసి మఱి తాన క్రమ్మఱ, గ్రాసము గొనునేఁతపురువుగతి నీకలుగం
జేసినయీవిశ్వమును ర, మాసఖ! మ్రింగుదువు నీవ మరలన్ లీలన్. 172

ఆ. హార్దపద్మవీథి నాహంతవాస్మదా, దృష్టగుణవిధానజుష్ట మైన
యౌపనిషద మైనయలనహరాకాశ, మీవ యగుటఁ గాంతు రీశ! బుధులు. 173

సీ. బోధాశ్రయత్వంబు బోధమాత్రత్వంబు, రూపించుశ్రుతులవిరోధ ముడిపి
యద్వితీయత్వంబు నంతరాత్మత్వంబుఁ, జాటుప్రాబలుకులజగడ ముడిపి
గుణనిధానత్వంబు గుణవిహీనత్వంబుఁ, గలిగించుచదువులకలహ ముడిపి
దేహసాహిత్యంబు దేహరాహిత్యంబు, వచియించునొడువులవైర మణఁచి

గీ. సాత్త్వికస్మృతితత్త్వంబు సంవదింప, నైకమత్యంబు గాంచుయథార్థవిదులు
తత్త్వమున నిన్నుఁ గనుఁగొని తావకాంఘ్రి, పద్మముల నేల విడుతురు పద్మనయన!

క. పరతత్త్వసమన్వేషణ, పరులై వెదకు గలవారు పదిలంబుగనీ
చరణములఁ బొప్పు వదలక, తిరిగి తిరోహితుని నిన్ను దెలియుదు రీశా! 175

క. ఊహింప సకలచిదచి, ద్దేహివి నీ వగుట లెస్స దెలిసినమీఁదన్
సోఽహ మనరాదొ! మరి దా, సోహ మనఁగరాదొ! బుధున కంబుజనాభా!. 176

సీ. రూపింపఁబడునీస్వరూప మిట్టిది గదా, జ్ఞానంబు నీకుఁ బ్రధానగుణము
పరమేశ! నీజగత్ప్రకృతిభావం బెద్ది, యది శక్తి నీకు రెండవగుణంబు
పేర్మితో స్వాతంత్ర్యబృంహితకర్తృత్వ, మైశ్వర్య మనఁగ మూఁడవగుణంబు
సకలప్రపంచంబు సతతంబుఁ జేయుచో, నలయమి బలము నాలవగుణంబు
గీ. జగదుపాదాన మయ్యు నిశ్చలత వికృతి, నందమియ వీర్య మనఁగ నేనవగుణంబు
కార్యకరణంబు నెడ సహకారి నొకటి, నపేక్షింపమి తేజ మాఱవగుణంబు. 177

చ. గుణములు నీకనంతములు కోకనదోదర! యాదిభారతీ
గణితము లందులోఁ బ్రథమగణ్యము లై చెలువారు నెవ్వి త
ద్గుణములు దార యన్యగుణకోటి సమస్తముఁ గుక్షిఁ దాల్చు దు
ర్గుణగణదూర! నీవు నిజకుక్షిఁ బ్రపంచము దాల్చుకై వడిన్. 178

తే. అల్పసంకల్పలీల నయ్యఖిలమునకు, సృష్టిరక్షాలయక్రియల్ సేయు దీవు
సహజతేజోబలైశ్వర్యశక్తివీర్య, గుణము లవి యెట్టియవియొ ముకుంద! నీకు. 179

క. నీమహిమాబ్ధికణస్థిత, మై మెఱయుప్రపంచ మిది యనంతం బనినన్
నీమహిమానంతత్వము, కైముతికన్యాయ మనుట గాదె! ముకుందా!. 180

క. దనుజాంతక! కౌతుకకృత, జన మనవరతానుభూతి శాస్త్రంబులచేఁ
గని గ్రుడ్డియు విని చెవుడును, జననరి నీమాయ కిఁక నసాధ్యము గలదే?. 181

ఉ. ఎవ్వరు మాట మమ్మెఱుఁగనీదు యథాకథితస్వరూప మై
యెవ్వఁడ వౌట నిన్నెఱుఁగ నీ దనుభావ్యతఁ దోఁచి యైనఁ దా
నెవ్వరి దౌటఁ దన్నెఱుఁగనీదు ధ్రువం బగు వెల్లివొట్టు నీ
దైవ్వనిమాయలో మునిఁగి తేలెడుమీలము గామె? యీశ్వరా!. 182

చ. క్షణమునఁ జేయుచేఁత యజకల్పశతాయుతభుక్తిఁ బో దను
క్షణమును బుణ్యపాపములు సంతత మై యొనరించుచొప్పు త
త్క్షణ మగునిమ్మహాభయదసంసృతికిన్ భవదంఘ్రిపంకజ
ప్రణతి యొకండు దక్క మఱి పారము గల్గునె! భక్తవత్సలా!. 183

క. అని మఱియుఁ బెక్కుతెఱఁగుల, వినుతింపఁ గృపార్ద్రదృష్టి వీక్షించి ఘనా
ఘనగంభీరస్వనమున, దనుజకులధ్వంసి దేవతాతతి కనియెన్. 184

క. క్షేమంబే మీ కందఱి?, కేమిటి కరుదేరవలసె ని? ట్లనుడు సుర
స్తోమానుమతి బృహస్పతి, తామరసోదరునియెదుటఁ దాఁ బ్రాంజలి యై. 185

. దేవ! సకలైకసాక్షివి, నీవెఱుఁగని దొకటి కలదె? నిక్కం బిపు డే

మై విన్నవింప విను టిది, మావలనం గలుగునట్టిమన్ననఁ గాదే!. 186

క. మాంధాతృమహీపతి దృఢ, సంధామతి నుగ్రతపము సలుపఁగఁ దత్తే
జోంధీభూతం బై ని, ర్బంధంబునఁ బొందినది ప్రపంచం బెల్లన్. 187

ఆ. ఇంద్రపదము నొండె నితరపదం బొండె, నతని కెద్ది యిష్ట మది యొసంగి
భువన ముద్ధరింప నవధరింపుము దేవ!, యిదియె మనవి మాకు నిప్పు డనిన. 188

వ. నరహాసితలసితవదనారవిందుం డగుచు మత్పదభక్తుం డైనయతనివలన నొరుల కెవ్వరికిం గీడు పొంద దట్లగుట నిశ్శంక మరలి చనుం డిదె యతనితపంబు నివారింపుదు నని కృపావలోకనంబునం బరితృప్తులం జేసి యనిపినం గృతార్థు లై మహేంద్రాదిబృందారకముఖ్యు లానందంబున నానందకపాణి కంతంతం బునఃపునఃప్రణామంబు లాచరించి చెచలి నిజనివాసంబులకుం జని యనంతరంబ. 189

సీ. దివ్యవిగ్రహకాంతినిర్వ్యధూవితతికి, హరినీలవల్లరు లభినయింపఁ
బేరురంబునయందు బెడఁ గైనకౌస్తుభం, బెల్లచోఁ గలయ నీరెండగాయఁ
బింబించి కట్టినబిగువుపచ్చనిపట్టు, తొలుకారు మెఱుఁగులఁ దుఱఁగలింప
నిడుదహస్తములఁ బూనినశంఖచక్రంబు, లినచంద్రదీప్తుల నీనికొనఁగ

గీ. శిరసుమకుటంబు నింగిఁ జిత్తరువు గొలుప, గల్లములఁ గుండలద్యుతి వెల్లి గొనఁగఁ
గలికితెలిసోగకన్నులఁ గరుణ చిలుక, జవనరుని మ్రోల శౌరి సాక్షాత్కరించె. 190

వ. ఇట్లు గరుడవాహనారూఢుం డై యశేషదివ్యమునిసేవ్యమానుం డై యఖిలభువనావనదక్షుం డై పుండరీకాక్షుండు ప్రత్యక్షం బగుటయు. 191

శా. హర్షాశ్చర్యభయంబు లుప్పతిల సాష్టాంగంబు గా మ్రొక్కి యు
త్కర్షింపంగఁ దరంబు గానియొకయంతస్సౌఖ్యముం బొంది పై
వర్షింపం బ్రమదాశ్రుపూరము కరద్వంద్వంబు నొక్కింత గా
శీర్షంబుం గదియించి సాంద్రపులకశ్రేణీపరీతాంగుఁ డై. 192

## మాంధాత శ్రీమన్నారాయణుని స్తుతించుట.

దండకము. శ్రీవల్లభా! గల్లభాగద్వయీదర్పణాత్యర్పణాలోక! లోకత్రయత్రాణలీలాకళావత్స! వత్సాత్మజాభర్తృచూళీపరిష్కారమందారమాలాభవత్పాదనిర్యత్పయోధార! ధారాసహస్రాంశుదీప్తప్రభాభాసమారీకృతారాతిదైతేయనాథావరోధాంజనధ్వాంతసంతాన! సంతానభూజప్రభావాదపార్థిప్రజాభీష్టవస్తుప్రదానప్రశస్తా! సమస్తాత్మభావానుభావంబు నీనంబుజాతాక్ష! కొన్నాళ్లు పైకొన్న నీమాయ నేమా యథామానముం గానఁగా లేక నానానుసంధానసంధానుబంధానుబంధాంధకారంబుచే నిన్నెఱుంగం జాలుంగం దరంబా? భువిం జిత్తగర్తంబునం గర్తృతాహంకృతిన్ జీవబీజంబు సంకల్పమోహాంకురం బెచ్చు నుద్దామకామాదికాండప్రకాండంబు లడ్డంబుగాఁ బుత్రమి

త్రాదిపత్త్రంబులం జొంపమై సంపదల్ మవ్వపుంగ్రొవ్విరుల్ గాఁ బునర్జన్మకృద్బీజ
సంయోజనామాత్రపాత్త్రంబు గాఁ గర్మమర్మంబునం బండ నొండొంటి కంటైనయా
మేను లన్నానులం దట్టమైనట్టినిస్సారసంసారఘోరాటవీవాటిక న్నిర్గమింపంగ మార్గం
బు లేకెమ్మెయిం ద్రిమ్మరం గండ్లు ముండ్లుం గొనన్ నొప్పిచే నెవ్వగం గూలుచుం
దూలుచుం దవ్వ్యపాయం బుపాయంబునం జెందు టానందమై తోఁచు సంపంద మై
నింద్రియద్వంద్వసంప్రాప్తిచేఁ దప్తులైనమానేరముల్ దూరముల్ చేసియాశీవిషాధీశ
శయ్యా! మదీయాపదల్ పాపవే! పాపవేగోదయం బింక మమ్మింక నాలింపఁ బాలింపఁ
గా దిక్కు దక్కెవ్వరే! నవ్వరే చీఁకునుం జీఁకుఁ జేయూఁత గాఁ జేఁత! నీదృశ్యవిశ్వం
బునందత్పరిభావంబు భావంబునం దాన కానంగ లేఁ డొక్కరుం డొక్కరు న్మస్తునిం
జేయఁగా శక్తుఁ డే? యుక్తిసంధిత్స మాత్సర్యబద్ధైకబుద్ధి న్వికల్పించి కించిత్పరిజ్ఞానముం
గానఁగా లేనిదుర్వారదుర్వాదులం గాదనం జాలి లీలాకలోత్సేకత న్నైకతాపాద్యమా
నుండవై యెన్న నుద్యోగివై నీతవిద్యాగతిన్ లోకముల్ దూరితాలోకముం జేసి
చీకాకుగాఁ గాకు సేయంగ నేపోకలం బోక యేకాకులై యాను లైశ్వర్యకార్యంబు
వర్జించి పంచేంద్రియాదిప్రపంచంబు నిర్జించి మోహంబులం గోసి దేహంబులన్ బూర్ణ
గేహంబులన్ రోసి శీతాతపాభీరులై జీర్ణపర్ణానిలాహారులై ఘోరతీవ్రప్రభాచార
చాతుర్యధుర్యుల్ మహాయోగిచర్యుల్ సదాగాధసంబోధసంబాధనిర్వ్యాఘహృద్వేఘులన్
నిన్నుఁ శోధించియున్ గట్టిగాఁ బట్టలే రన్న మమ్మెన్నఁ గానేల? యేలా వృథాగాథ
లింకన్? భవాంధాంధుమూలంబులం గూలియుక్కెఁది దిక్కెఁదియున్ లేనిమాపుల్పనా
ఢానుకంపాగుణావిద్ధులం జేసి నీ వుద్ధరింపంగఁ దా రెంతయున్ నీపదారాధనాసాధనా
సక్తులై భక్తిసంయుక్తులై ముక్తులై శుద్ధ మిద్ధంబు వేదప్రసిద్ధం బనూయం బమానం
బమేయం బజేయం బవాచ్యం బమోచ్యం బనాశం బనీకాశ మేసౌఖ్య మాసౌఖ్యముం
గాంతు రబ్జాలయాకాంత! యేక్రంతలన్ వ్రంతలన్ రంతలం జెందలే న్గుంపలే నింక
నేఁ గింకరత్వంబు తత్వంబు గాఁ జూచెదన్ దాస్య మాశాస్యముం గాన పేక్షించెదన్
భృత్యకృత్యంబు నిత్యంబు గాఁ గోరెదన్ సేవకత్వంబు సత్త్వంబు గా నెంచెదన్ దాస
కీయార్హనిర్హేతుకారుణ్యగణ్యైకవీక్షం గటాక్షింపవే! శిష్టరక్షాపరా! దుష్టశిక్షాకరా!
ధర్మసంస్థాపకా! శర్మసందీపకా! భక్తకర్మచ్ఛిదా! ముక్తిమర్మప్రదా!. 193

సీ. తృష్ణాపరుండైన తెరువరి తియ్యని, మున్నీటిసలిలంబు లెన్ని గ్రోలు
నిఱుపేద యగువాఁడు నిర్జరగిరిఁ జేరి, జాతరూపం బెంత సంగ్రహించు
గణనాపరుండైన గణకుండు సముకొని, రిక్కల నెన్నింటి లెక్కవెట్టు
లంఘనోన్ముఖుఁడైన జంఘాలుఁ డొక్కరుం, డిమ్మహీవలయంబు నెంత గడచు
గీ. నట్టివయ్య పో యనంతకల్యాణగుణస, మృద్ధుఁ డగునిన్ను నను బోఁటి యెంత పొగడు
నెంతమాత్రముఁ బొగడుట కేది యొఱుక?, యొఱుక నేఁ డంకఁ గలుగు నేయోశ్వరి!

చ. తొలుదెస వెల్వు మానికపుఁ దొరపుఁ గాంతికి మేలుబంతి క్రొ
మ్ములక మొయిళ్లనన్నియలమొల్లమికిం దగుపుట్టినిల్లు గుం
పులుగొను తోరపుంబసిమిబూమియచూపువిడంబనంబు నీ
బలితపుమేనిచాయ కనఁబండువు నాకొనరించె నచ్యుతా!. 195

చ. అసుజలవర్గముం జలరుహంబులు నీశ్వర! తారు శారదో
ల్లసనముఁ బూని యొప్ప నవిలంఘ్యతమఃకృతమీలనంబు రా
జసన్ఫూతికల్మియుం బలిప్రసాదము నొందక యుండునట్టినీ
యసమపదాబ్జయుగ్మ మలరారెడు మామకమానసంబునన్. 196

చ. సురపదికంటెఁ దార తొలుచాలుసుమీ యని యెల్లవారికిం
జిరతరధాళధళ్యమునఁ జెప్పక చెప్పెడుభంగిఁ బొల్చునీ
చరణబిసప్రసూననఖచంద్రమరీచులు పర్వి నామదిం
బొలుతనంబు వో నడిచెఁ దోయరుహోత్పలబంధులోచనా!. 197

చ. సిరియును ధాత్రియున్ శయనశేశయయుగ్మముఁ బ్రవీణలై
సరసత నొత్తువోఁ బొసలి సంకులముత్పలకాంకురావళుల్
దెరసిన యప్పుడీ మెఱుఁగుఁబిక్కలు నిక్కము నిక్కము దాల్పకుండునే
యురగశయానా! పాదకమలోచితకంటకనాశభావమున్?. 198

ఉ. అందము సైపనీ తొడలయాకృతిశోభ వహింప లేనియా
నిందకుఁ జాలమిన్ నిలువునీ అగుటెంత యసంటికంబముల్!
నందితభక్తలోకయతులం బగునీభవదూరుసామ్యముం
బొందఁ దలంచు ధూర్తమునఁ బొందె నధోగతి హస్తిహస్తముల్. 199

ఉ. కన్నులపండువై ధగధగం జిగిరంగు దుఱంగలింపఁగాఁ
జెన్ను వహించు నీపసిఁడిచేల వహించిన నీలవర్ణ! నీ
యున్నతిఁ జూడ మీఁదనగ మెల్ల ఘనాఘనపంక్తి పర్వి పై
క్రొన్నెమెఱుంగుబంగరువుకొండగతిం దిలకించె నెంతయున్. 200

ఉ. లోకము లన్నియున్నియును లోఁగొనియుం దనలేమిఁ జూపునీ
యాకృతిమధ్యభాగ మిపు డీక్షణలక్ష్యము గా దటంచు నే
నాకసుతేశ! లే దనుట యుక్తము గా దల బ్రహ్మఁ గన్న నా
కోకముతోడి సాక్షికిని లేమి ఘటిల్లెడునట్లు గావునన్. 201

చ. పొలుపుగ మధ్యదేశమునఁ బూనినకౌస్తుభ మెట్టిచాయలన్
ఘళఘళితద్యుతుల్ గొలుప దైత్యవిమర్దన! నీయురంబు ని
ర్మలరుచి నూనెఁ బొల్చె నదుపుం బ్రతిబింబితబాలభానుమం
డలము పొలంగఁ బొల్చు యమునానది గన్నహ్రదంబుకైవడిన్. 202

చ. దళితమహేంద్రనీలరుచిదాయకవిగ్రహ! నీగభీరతా
జలనిధిభావముం దెలుపఁ జాలినలక్షణలక్షితంబు లై
యలవడెఁ గంకణాంకితము లై సముదంచితశంఖచక్రసం
కలితము లై యభంగపరిఘాసమతుంగభుజాతరంగముల్.

చ. తనసుషమావిశేషములఁ దప్పక శంఖములం జయించుటం
దనికినకీర్తిరేఖలవిధంబున నుజ్జ్వలకాంతిఁ బొల్చునీ
యనుపమతారహారలతికాపరికల్పితవేల్లనంబుచేఁ
గనుఁగొన నొప్పు నీ కిపుడు కంధరకంధరవర్ణబంధురా!.

చ. వెడవెడ క్రొత్తక్రొత్తమొగి విచ్చినకెందలిరాకుఁ గెంపు చూ
పెడుజిగి గల్గునీయధరబింబమరీచులు దొంగలింప నీ
బెడఁగు వహించు నెమ్మొగము పేరిటిపున్నమచందమామకుఙ్
సడలనిదట్టపుంబొడుపుఁ జాయ ఘటించెడు నంబుజోదరా!.

చ. తిలకితదంతకాంతు లనుతీవ మెఱుంగులు సుస్వరాఖ్యగ
ర్జలు గలనీవచోమృతరసంబులు పైఁ గురియంగ నామదిం
గలభవతాప మెల్ల విడి గ్రమ్మె యంగకదంబకంబులం
బులకనవాంకురంబు లివి పొం దగురీతి గదా! గదాధరా!.

ఉ. ముద్దులు గుల్కునీభువనమోహనకుండలరత్నదీధితు
ల్గద్దఱిలాగు పై ధళధళం బొలుపారెడుభంగిఁ జూడఁ గాఁ
దద్దయుఁ జెన్ను మీరెడుఁబదప్రణతానవకేళిలోల! నీ
నిద్దపుఁ జెక్కుటద్దముల నిల్వక జాఱుచుఁ బ్రాఁకుకైవడిన్.

ఉ. క్రొవ్వున మచ్చరించి తుద గూడక వే శరణార్థిబుద్ధితో
నివ్వటిలంగ నీమొగము నెమ్మదిఁ జొచ్చి వెలుంగుచున్నవుం
గ్రొవ్విరితెల్లదామర లొకో! యనఁ గాఁ దగి చక్రహస్త! తే
నవ్వు దొలంకునీదు నయనంబులు నామదిఁ జూఱలాడెడిన్.

ఉ. నాసిక పేరిమవ్వపుటనంటికిఁ బైబొటు లాకు లయ్యె ను
ల్లాసము చూపులేఁతమొవులాగు మెయిం దిలకంబు గల్గెనుం
బ్రాసవగంధ మింపు నని బంభరడింభకపఙ్క్తి చేరున
ట్లై సకలేశ! నీదునిటలాలకజాలక మింపు గొల్పెడిన్.

చ. అభయవితీర్ణిధుర్య! కరుణామృతవర్షము చూపుమేఘస
న్నిభుఁడగునీకు నీవివిధనిర్మలరత్నకిరీటభూషణ
ప్రభలు ఘటించు చున్నయవి భక్తమయూరమహోత్సవంబు గా
నభినవపాకశాసనశరాసనసృష్టికళాకలాపముల్.

ఉ. ఉల్లము చల్ల నయ్యె మొద లూడె మనోరథముల్ జగంబుపై
నొల్లమి పుట్టె చేరఁగడ నొందితి నీశుభదివ్యవిగ్రహో
ద్యల్లసనావలోకనసుఖోదధిలోపల నోలలాడుచుం
బొల్లిటివాఁడఁ గానిగతిఁ దోయరుహేక్షణ! సంతసించెదన్. 211

చ. తెలియనిధూర్తవర్తనులు తెంపరులై తమయుక్తిభంగులన్
బలుకుట గాక నిక్కముగ భక్తివశుం డగునిన్నుఁ జూడఁగాఁ
గలుగుటకంటె నొండొకసుఖంబును గల్గునె? కల్ల నిమ్ము! నా
తలఁపున కింపు గా దిదియ తప్పక కల్ల ననుగ్రహింపవే!. 212

క. అని భక్తిపరతఁ గ్రమ్మఱ, వినతుం డగునృపునిఁ జూచి విశ్వైకగురుం
డనుకంపమై ఘనాఘన, ఘనగర్జాస్వరవిధావికస్వరభణితిన్. 213

## శ్రీమన్నారాయణుండు మాంధాత ననుగ్రహించుట.

తే. కువలయేశ్వరచంద్ర! నీకోరినట్లు, మోక్షఘంటాపథం బైనమునివరైక
దుర్లభాస్మత్పదాంబుజోద్భూతభక్తి, గలుగు నీ కింక నాయనుగ్రహమువలన. 214

వ. అస్మదీయమాయావిమోహితం బైనజగజ్జనంబు యథార్థంబున నన్నెఱుంగను మత్పద
ప్రాప్తిరూపమోక్షంబు గొనను నెఱుంగదు. నీవు మదీయమాయాజయంబును మత్పద
ప్రాప్తిసాధనం బైన మదీయపదభక్తియు నొసంగితి నెప్పటిగతి రాజ్యపరిపాలనంబు
సేయుచు మద్భక్తియోగనిష్ఠుండ వై యుండు మని కృపావలోకనసుధాధారల నభిషి
క్తునిం జేసి భగవంతుం డంతర్ధానంబు నొందినం గృతార్థుం డై. 215

శా. చేసెం బ్రాజ్యము గాఁగ రాజ్యము నృపశ్రేష్ఠుండు ధీనిష్ఠుఁ డై
త్రాసాపాదితదోషదూరఘనరత్నద్రత్నగర్భాసము
ద్భాసిస్వీయభుజాభుజంగమనిపీతక్రూరవీరారికాం
తాసోల్లాసవిలాసహాసనికరోదంచద్యశఃపూరుఁ డై. 216

క. కవితావిచక్షణత గల, కవి కంఠవిభూషణముగఁ గైకొనవలయుం
గవినరసింహవిరచిత, కవికర్ణరసాయన మనుకావ్యము దీనిన్. 217

## ఆశ్వాసాంతము.

శా. ప్రస్తుత్యప్రవిస్ఫుల్లహల్లకరుచిస్పర్ధాళుహస్తాభయ
ప్రస్తారప్రతిభారితానతజనవ్యాపర్యాయనాదోద్యమ
ప్రస్తారోద్ధనకప్రతీకవిలసత్ఫాల స్థలాద్రిస్ఫుట
త్కస్తూరీతిలకోపలక్షితదళత్కల్హారవారత్రపా. 218

క. ఆదిమశఠకోపాది, ద్వాదశనిజసూరివిరచితద్రావిడగ్రం
థాదృతసతతశ్రవణా, స్వాదకళాముక్తముక్తసామవిభేదా. 219

మాలినీ. శతశతరవితేజా సర్వరాజాధిరాజా
నతజనసురభూజా నాభిదీవ్యత్సరోజా
సతతమహితభూమా సత్యసంపూర్ణకామా
దితిసుతకులభీమా దేవతాసార్వభౌమా. 220

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహసేవకోపసేనకనరసింహనామధేయ ప్రణీతం బైనకవికర్ణరసాయనం బను కావ్యంబునందుఁ దపశ్చరణంబును, గ్రీష్మవర్షా శిశిరర్తువర్ణనంబులును, అప్సరస్సమాగమప్రకారంబును, నృత్తప్రపంచంబును, సముద్రవర్ణనంబును, వైకుంఠవర్ణనంబును, భగవద్దివ్యమంటపవిగ్రహవర్ణనంబును, స్తోత్రంబును నన్నది సర్వంబును షష్ఠాశ్వాసము.

కవికర్ణరసాయనము సంపూర్ణము.



చెన్నపురి : వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల యందు
ముద్రితము — 1916.